# పురుషకారము

## శ్రీ రామానుజ తారావళి

### (పద్యకావ్యయుగళి)

వేముగంటి నరసింహాచార్యులు





ప్రచురణ
సాహితీ వికాసమండలి
సిద్దిపేట.

ప్రథమ ముద్రణ జూలై 1991

ప్రతులు 1000

వెల రూ॥ 5/-

ప్రతులకు:-
వి. నరసింహాచార్యులు
రామమందిరము, సిద్దిపేట.

---

ఈ గ్రంథము:

**తిరుమల తిరుపతి దేవస్థానముల వారి**
**ఆర్థిక సహాయమున ముద్రింపబడినది.**

---

ముద్రణ:

**రాజా ప్రింటర్స్ & బైండర్స్**
పాత గంజు, సిద్దిపేట.

# కృతి సమర్పణ



## శ్రీ వేంకటేశ్వర స్వామి
## చరణ కమలములకు

శ్రీ వేంకటేశ పదరా
జీవయుగళమునకు భక్తి చెలగ, ప్రపత్తి
ప్రావణ్యమున సమర్పణ
గావించెద ఈ తెలుంగు కావ్యసుమంబున్

శ్రీ మతేరామానుజాయనమః

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణరామానుజ జీయరుస్వామి వారి

# మంగళాశాసనము

శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యస్వామి!

మీ కృతి చేరినది. స్థాలీపులాకన్యాయముగా చూచితిమి. చాల బాగున్నది. పురుషకారమనునది శ్రీ రామానుజ సంప్రదాయమున చాల ప్రధానమైనదికదా! ఇది లక్ష్మీదేవికి పేరు. పురుషుడని భగవంతునికి పేరు అంటే కోరినవారికి కోరికలను మించియిచ్చువాడు అట్లు యిప్పించు తల్లి లక్ష్మీదేవి. జీవులపాపములను చూచి తిరస్కరించు భగవానుని అనునయించి పెడమొగమిడు జీవుని లాలించి ఇరువురను ఒకచోట చేర్చుఘటకు రాలు కనుక ఆమెకు పురుషకారమనిపేరు అయితే ప్రేమ స్వరూపిణి అయిన ఆమెను ఆశ్రయించుటకు కూడ ముందు ఆచార్యకరుణ జీవునికి లభించ వలసియున్నది. అటు శ్రీ మన్నారాయణుని, ఇటు జీవునికి మధ్యఉండి ఘటక కృత్యము నిర్వహించి ఇరువురను కాపాడెద రీ ఆచార్యులు లక్ష్మీ దేవి ఆశ్రయణకు మధ్య ఆచార్యులుండవలసియున్నది కాని, ఆచార్యా శ్రయణకు మధ్య ఏ ఆటంకము లేకుండా జీవునికి తెలియనినాడు వీనిని చూచి ఉద్ధరించి పురుషకార శబ్దానికి సాక్షాదర్థ స్వరూపులగుచున్నారు అట్టి ఆచార్య పరంపరకు ఆద్యులనదగి, శిరస్థానమందున్న శ్రీ భాష్య కారుల వైభవ ప్రకాశకముగ మీరు సాగించిన 'పురుషకారము' 'శ్రీరామా నుజ తారావళి' ఎంతో హృద్యముగ, అనవద్యముగ అమరినవి ఇవి ఆచార్య శ్రీ రామానుజుల వారి హృద్యతములై మీచే మరింత సత్సం ప్రదాసేవ చేయించుకొను గాక!.

విద్యాభూషణ-కవితా విశారద
**ధనకుధరం వరదాచార్యులు**
శ్రీ లక్ష్మీనారాయణపురము,
గుంటూరు-6.

# శుభాకాంక్ష

'కవికోకిల-విద్వత్కవి-కావ్యకళానిధి' బిరుదాలంకృతులు, పండిత ప్రకాండులు, శ్రీ వైష్ణవ ధర్మారాధకులునగు శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులవారిచే రచింపబడిన (1) పురుషకారము (2) శ్రీరామానుజ తారావళి, అను రెండు పద్యరచనలు శ్రీ రామానుజ కీర్తి కౌముది 11, 9 భాగములలో ప్రచురింపబడినవి. ఈ రెండు పద్యరచనలను ఒకటిగా చేర్చి 'శ్రీరామానుజ తారావళి' అనుపేర శ్రీమాన్ నరసింహాచార్యులవారు ప్రచురించి దీనిని శ్రీ వేంకటేశ్వర స్వామికి అంకితమిచ్చుట మిక్కిల ప్రశంసనీయము. శ్రీమాన్ నరసింహాచార్యులవారి దివ్యలేఖిని నుండి సంప్రదాయ బద్ధములైన ఇట్టి పద్యరచనలు మఱికొన్ని వెలువడి, భక్త ప్రపన్నులకు మోద పరిమోదములను చేకూర్చుగాత! ఇది యే మా శుభాకాంక్ష.

## శ్రీ భాష్యం అప్పలాచార్య స్వామి

విశాఖపట్నం.

# ఆమోదము

శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులవారు తెలంగాణమున ప్రసిద్ధినందిన మహాకవులు, మహావిద్వాంసులును. వారు శ్రీ వైష్ణవసంప్రదాయమునకు చెందినవారు. శ్రీ వైష్ణవసంప్రదాయమున భగవత్ప్రాప్తికి అందరికినీ అర్హత ఉన్నదని భగవద్రామానుజులు చాటినారు. తన ప్రయత్నముచే జీవుడు మోక్షమును పొందలేడు. భగవదనుగ్రహమే దానికి కారణము. భగవదనుగ్రహము సంపాదించుట దుఃఖోత్తరమగు సంసారమున నిబద్ధుడగు జీవునకు సులభముకాదు. అది మహాపురుష సమాశ్రయణముచేతనే లభింపవలెను. మహాపురుషులు ఘటకులై మహాలక్ష్మిద్వారా భగవానుని అనుగ్రహము జీవునిపై ప్రసరింప చేయుదురు. మధ్యవర్తియై ఉండి జీవుని పరమాత్మతో ఘటనచేయు లక్ష్మీదేవిని పురుషకారము అందురు. పురుషుడనగా పూర్ణుడనియర్థము పురుషునిగా చేయునది పురుషకారము బిడ్డలు తనవద్ద లేనినాడు పురుషుడు పూర్ణుడుకాదు. జీవులు కర్మకృతమగు జన్మపరంపరలో ఖేదమునందుచు వారి కర్మపరిపాకము ననుసరించికాని ఫలమీయ రాదను నియమమునకు కట్టుబడినవాడగుటచే వారి నుద్ధరింపలేడు. నారాయణునితో నిత్యానపాయినియైన శ్రీదేవి జీవులను కటాక్షించి వారి మొరలను విని, స్వామికి విన్పించి, స్వామినెన్నడును వీడియు డక, జీవులచే సేవింపబడదగినదై ఉండి, జీవులదోషములను తొలగించి, వారి గుణములను పోషించును. అపుడు జీవులు, పరమాత్మ అన్యోన్యము అభిముఖులగుదురు. స్వామికృప జీవునిపై ప్రసరించును. జీవునిపొంది పరమాత్మ పూర్ణతనందును. ఇట్లు రక్షింపబడదగినవారు లేక అపూర్ణతతో ఉన్న భగవానునికి రక్ష్యవర్గమును సమకూర్చి పూర్ణతను కల్గించు శ్రీ మహాలక్ష్మిని పురుషకారము అందురు అట్టి లక్ష్మీదేవి సంబంధముచే ఆచార్యులు, భాగవతులుకూడ పురుషకారమని వ్యవహరింపబడుచుందురు అట్టివారిలో ప్రథమగణ్యులు యతిశిఖామణి శ్రీ భాష్యకారులు వారి అవతారకాలమున జరిగినది ఒక ఇతివృత్తమునాధారముగా చేసికొని

పురుషకారభూతులగు శ్రీ మద్రామానుజుల దివ్యమహిమను, ఉదారతను, దయాళుతను సూచించు కావ్యము పురుషకారము. శ్రీ రామానుజుల వారు దివ్యదేశయాత్ర చేయుచు శ్రీవైష్ణవ మతమును సార్వజనీనముగ అందించుచు తిరుమలకు వేంచేసిరి. అచట స్వామిని సేవించి దిగువ తిరుపతిలో కొద్దిరోజులుండి ద్రావిడ ప్రబంధములసారము ప్రవచించుచు అనుగ్రహించుచుండిరి. అచట ఒక గొల్లపడతి శ్రీ రామానుజుల శ్రీ సూక్తులను విని "భాగవతోత్తమ పదసేవాగరిమ"ను ఎరింగి వారికి కైంకర్యము చేయుచు 'గొల్ల ఇల్లాలు పున్నెమ్ము కొల్లగొనియె' ఆమె భక్తిశ్రద్ధలకు భగవద్రామానుజులు సంతసించి నీకేమి కావలెనని ప్రశ్నించిరి అపుడామె 'భాష్యకార' పల్కాములు పాముకై విసపు వాసనల న్విరజిమ్ముచుండె సత్యనిత్యామిత సౌఖ్యదాయక పదము' సనుగ్రహింపుమని ప్రార్థించినది ఆమె ప్రపత్తికి భాష్యకారులెంతో ప్రమదమందిరి ఆమె మోక్షేచ్ఛ వారి నలరి పచేసినది అపుడు వారు ఒక పత్రమును వ్రాసిఇచ్చి శ్రీవేంకటేశ చరణారవిందములయందు అర్పించుము నీకు మోక్షమునొసంగు ననియానతిచ్చెను 'కల్లకపటము లెరుగని గొల్లపడతి ఆపత్రమును వేంకటేశుని చరణములపై సమర్పించి మోక్షమున దినది. పురుషకార వైభవమును గొల్లపడతి లోకానికి ప్రకాశింపజేసినది శ్రీరామాయణములో శబరి ఆచార్య సమాశ్రయణవైభవాన్ని చాటినట్లే ఈ గొల్లపడతికూడ శ్రీరామానుజులవారి పురుషకార భావాన్ని ప్రకాశింపచేసినది కర్మకాని, జ్ఞానము కాని, భక్తికాని, వేదాధ్యయనముకాని, తపస్సుకాని. దానముకాని, యజ్ఞము కాని, జన్మకాని, వృత్తముకాని మోక్షమునకు సాధనములు కావు, భగవత్కృప వ్రసరించు ద్వారమగు భగవద్రామానుజులే మోక్షద్వారమని ప్రకాశింపజేసిన పురుషకారము అనెడి ఈ మహాగ్రంధము ఆకారములో చిన్నది మహిమలో మిన్నయైనది దీనిని సేవించి ముముక్షులోకము తరించుగాక

శ్రీమాన్ వేదుగంటి నరసింహాచార్యులవారు తమ కవితా మౌక్తికమాలలో శ్రీ రామానుజుల తారావళి నిర్మించి సమర్పించినారు ఇరువదియేడు పద్యములుండుటచే నక్షత్ర సంఖ్యగా దీనిని తారావళి అని వ్యవహరించినారు. శ్రీ రామానుజ తారావళి ప్రపన్నులకు నిత్యానుసంధేయము. ప్రతి పద్యమునందును మకుటముగా రామానుజ నామమును

ఇందుపొందుపరచినారు శ్రీరంగామృత కవిఅనెడి మహాకవులు భగవద్రామానుజులపై 'రామానుశనూత్తందాది' అని ద్రావిడమున నిబంధించినారు శ్రీ రామానుజ వైభవాన్ని, చేతనులకు వారుచేసిన ఉపకారాన్ని పేర్కొనుచు 108 పాశురములలో రామానుజనామమును నిబంధించినారు. 108 సార్లు రామానుజనామాన్ని జపించుటకు అవకాశం కలుగుటచే దానిని గాయత్రీ మంత్రంగా ప్రపన్నులు భావిస్తారు దానికి 'ప్రపన్న గాయత్రి' అని వ్యవహారము. అట్లే శ్రీమాన్ నరసింహాచార్యులవారి తారావళి రామానుజ పదాంకితమై ప్రపన్న గాయత్రిగా నిత్యము అనుసంధానము చేయదగిన అమూల్యమైన గ్రంథము శ్రీరామానుజ దివ్యచరిత్రమును, వారు లోకానికి చేసిన మహోపకారాన్ని, వారి దివ్యమంగళ విగ్రహ సౌందర్యమును ఇందు మధుర సుందరముగా చిత్రించినారు. వీరి శైలి సహజము, మధురము, ప్రసన్నము వారు సంస్కృతమున ఆంధ్రమున నిష్ణాతులగుటచే నిర్దుష్టమగు గ్రంథనము ఇందు గోచరించును సమాసములు సహజములై, సులభములై ఇందు కన్పట్టును. ఇట్టి రామానుజ తారావళిని అనుగ్రహించిన శ్రీమాన్ నరసింహాచార్యులవారు ప్రపన్నజన సేవనీయులు శ్రియఃపతివారు సంప్రదాయ ప్రచారమునకు, ఆచార్య వైభవ ప్రకాశనమునకు వారి కవితను ఉపయోగించునట్లు దీర్ఘాయురారోగ్యములతో విలసిల్లునట్లు అనుగ్రహించుగాక.

నాకీమహావకాశాన్ని కృపచేసిన శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యుల వారికి సర్వదా కృతజ్ఞుడను.

హిరానగర్, విశాఖపట్నం.

22-7-1991.

**శ్రీ. అప్పలాచార్యులు**



# నా మాట

ఈ కృతియుగళము రచించుటకు ప్రేరకులు, కారకులు మహా పండితులు, 'విద్యాభూషణ శ్రీమాన్ ధనకుధరం వరదాచార్య స్వామి వారు. వారికి నా నమోవాకములు.

మంగళాశాసనము కృపచేసిన శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారికి కృతజ్ఞతా పూర్వక ప్రణామాంజలి.

ఆమోదము ప్రకటించిన మహా విద్వాంసులు శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామి వారికి, శుభాకాంక్షలు తెలిపిన 'కవితా విశారద' శ్రీమాన్ ధనకుధరం వరదాచార్య స్వామివారికి కృతజ్ఞతా పూర్వక నమస్సుమాంజలి. గ్రంథ ముద్రణకు ఆర్థికముగా తోడ్పడిన తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి కృతజ్ఞతాభివందనములు.

ముఖ చిత్రమునకై శ్రీ రామానుజులవారి చిత్రపటమును రచించిన చిరంజీవి ఎ. ప్రభాకర్‌కు ఆశీస్సులు.

గ్రంథమును అందముగా అచ్చువేసిన రాజా ప్రింటర్స్ (సిద్దిపేట) వారికి ధన్యవాదములు.

....వేముగంటి నరసింహాచార్యులు

శ్రీనివాస పరబ్రహ్మణేనమః
శ్రీమతే రామానుజాయ నమః

# పురుషకారము

శ్రీ రామానుజ మౌనిచంద్రుడు దయా
సింధుండు, సద్బంధుడున్
శ్రీ రంగేశ పదారవిందయుగళీ
చింతామృతాస్వాదనో
దారుండై ప్రియ శిష్యసంఘము
నితాంత ప్రీతి సేవింపగా
శ్రీ రంగంబున నిత్యవాసముగ
వెంచేసెన్ జగద్వంద్యుడై

ముంగిటి పెన్నిధి కొంగుల
బంగారము, పెరటి కల్ప పాదపమగు శ్రీ
రంగేశుని సేవించును
సంగతి యతిరాజు భక్తి సంభావితుడై

మాయాప్రమేయ విధేయ చేతనగణో
ద్ధారక శేషావతారమూర్తి
కాంతాశిరోమణి కాంతిమతీ గర్భ
కమనీయ శుక్తి ముక్తా ఫలమ్ము
కాశ్మీర శారదాకలిత శ్రీ భాష్యకా
రాఖిద వరబిరుదాం చితుండు
ద్రావిడవేద దివ్యప్రబంధార్థ
ప్రచార సమాహిత ధీరవరుడు

గురువునాజ్ఞ మీరి తిరుమంత్రి రాజము
విశ్వజనులకెల్ల వెల్లడించి
వాసిగను పరమకృపాసిధి రామాను
జార్యవర్యు లోక మభినుతించు

మిలమిలలుగారు మిసిమి పన్నెల తోడ
మిసమిసలాడు నెమ్మేను వెలయ
వగడంబు డంబుతో జగడంబు గావించు
మోవిపై చిరునవ్వు మొలక వెలుగ
విన్నాణ మొలికించు కన్నుదామరలతో
కరుణా మరందము గడలుకొనగ
శారద చంద్రికాచ్ఛాయలు మీరు
సుందరముగా ఊర్ధ్వపుండ్రములు దనర

విమలకాషాయ పరిధాన వేషమెసగ
విష్ణుమత సమున్నతిని తెల్పెడు ననంగ
దండిగా వెలుగొందు త్రిదండ మొప్ప
అలరుచుండు శ్రీ రామానుజార్యమౌళి

దురిత భరిత సంసారసాగర నిమగ్న
చేతనుల నుద్ధరించి రక్షించుకొఱకు
పేర్మి రామాను జార్యులు విష్ణుమతము
నుర్వి వ్యాపింపజేయగా నుద్యమించె

అవలీలన్ నవలీలగా, పొలుపుగా
ఆసేతు శీతాచలం
బవనిన్ పర్యటనం బొనర్చుచు
విశిష్టా ద్వైత సిద్ధాంతమై
భవమున్ సర్వదిగంతరాళములలో
వ్యాపింపగా జేసి, ధీ
రవరేణ్యస్తుతి పాత్రుడై వెలిగె
శ్రీ రామానుజార్యం డొగిన్

ఆల శ్రీ కూర్మమ్మును, మం
గళగిరి మొదలైన పుణ్యకలిత క్షేత్ర
మ్ముల విష్ణుమతము స్థితి సం
ధిల నిలుపుచు ఉడయవరులు తిరుమల జేరెన్

శ్రీ వరాహుని దర్శించి, తెలచి, కొలిచి
పిదప శ్రీ వేంకటేశు కోవెలకు నేగి
పరమభక్తి ద్వైవార ముమ్మారు ప్రదక్షి
ణించి యతిపతి స్వామి సన్నిధిని జేరె

భువన మోహన సుందరమూర్తి యైన
వేంకటాచల విభుని సేవించి, తనువు
పులకరింపగ కన్నుల మోదబాష్ప
జలము జాల్వారగ ఈరీతి నన్నుతించె

వైకుంఠ మందిరాలలో కనోత్సవమును
మరచు నీదర్శన విలసనమ్ము
పునుగు, జవ్వాది, కర్పూరమ్ము, కస్తూరి
వాసించు నీ తీర్థవైభవమ్ము
కమ్మని నేతితో కల్పింపబడి గుమ
గుమలాడు నీ ప్రసాద మహిమమ్ము
తులసీ, ప్రసూన మంజుల భవత్పాదాంక
దీపితమగు శఠకోపగరిమ

ప్రస్తుతింపగ వశమె ఎవ్వారికైన
తలప కలియుగ ప్రత్యక్షదైవ మీవు
శ్రీనివాస! దయావాస! చిద్విలాస!
పంకజాప్తప్రకాశ! శ్రీ వేంకటేశ!

నీ కల్యాణ గుణామృతానుభవమున్,
నీ నామ సుధ్యానమున్,
నీ కారుణ్య కటాక్ష వీక్షణములున్,
నీ దివ్య సందర్శన
శ్రీ కైవల్యపద ప్రదమ్ములు
ధరిత్రిన్ మానవశ్రేణికిన్
వ్యాకోచాంబుజనేత్ర! శేషగిరివాసా!
వేంకటేశ ప్రభూ!

ఎంత చూచినను గానీ తనివితీరదు
నీ మూర్తి సౌందర్య మేమనందు?
ఎంత వర్ణించిన తృప్తి చేకూరదు
నీ మహావైభవ మేమనందు?
ఎంత పాడిన రుచియే తగ్గబోదు
నీ నామ మాధుర్యము నేమనందు?
ఎంత శోధించిన అంతమే కనరాదు
నీ మహిమోన్నతి నేమనందు?

ఎంత మున్గిన గాని రవ్వంతయేని
లోతు కనరాదు, కొలతకు లోనుగాదు
స్వామి! నీదయా గాంభీర్యమేమనందు?
పంకజాప్త ప్రకాశ! శ్రీ వేంకటేశ!

తన్నిసానువులతో రంజిల్లు హేమాద్రి
డంబుమించిన కిరీటంబు వరం
చంద్రసూర్యయుగంబు చందాన పొందుగా
కాంతిల్లు శంఖ చక్రములు మెఱయ
గురు షట్క నక్షత్రగరిమను మఱపించు
నాణెంపు వజ్రకుండలము లొప్ప
తొలిసంజ పసిడి నిగ్గులను సిగ్గిలజేయు
జలతారు పట్టు దువ్వలువ వెలయ

మెలుగా కన్నులకు మిఱుమిట్లు గొలిపి
దివ్య తేజోవిరాజిత నవ్యమగుచు
అలరు నీరూపు దర్శించి పులకరింతు
పంక జాప్త ప్రకాశ! శ్రీ వేంకటేశ!॥

ఈ విధమున వేంకటేశుని సేవించి
వినుతిచేసి, ధన్యతను భజించి
నిండుమదిని ఏడు కొండలు దిగివచ్చి
భాష్యకారులు తిరుపతిని జేరె

మంగళరూప, అభంగుర
మంగళదాయిని, దయార్ద్రమానస అలమే
ల్మంగాదేవిని సేవిం
పంగన్ యతిరాజు వెడలె మంగా పురమున్

పొంగిన మనమున యతిపతి
మంగను వినుతించె నిట్లు॥ మానవరక్ష
సంగత! సంతతకరుణా
పాంగా! స్నిగ్ధాంతరంగ! అలమేల్మంగా

జాలుకొను మేల్ కనికరపు పాలవెల్లి!
కలిత శ్రితజన సముదయ కల్పవల్లి
నవ్య సౌందర్య నందనానంద వల్లి!
మానినీమణి! అలమేలు మంగతల్లి!

కుంకుమార్చన మోదితా! కోమలాంగి!
కింకరీకృత దేవతా! పంకజాత
లోచనా! వేంకటాద్రిశిలో చనప్రవ
రోచన స్నిగ్ధముగ్ధ స్వభావ! పద్మ!

దరహాసాంకుర శోభితాధరము,
ముక్తారత్న భాస్వన్మనో
హరనాసాభరణంబు, స్వర్ణమణి
వస్త్రాలంకృతుల్, వజ్రబం
ధురకోటీరము గల్గుమూర్తి విభవా
నూనంబునన్ వెల్గునీ
స్మరణంబే శరణంబు మాకు
అలమేల్మంగా! జగన్మాతృకా!"

మంగాపురమున అలిమే
ల్మంగను సేవించి మోదమానసమున స
ప్పొంగుచు రామానుజముని
పుంగవు డేతెంచె మజలమొగి తిరుపతికిన్

కొలమానము తలగడగా
వెలసిన గోవిందరాజు విభవస్ఫూర్తిన్
తిలకించియు, పులకించియు
తులకించెను ఉడయవరులు స్తుతిపూర్వముగన్

"వేంకటాచల విభుని సేవించి, దిగువ
తిరుపతిని విలసిల్లు నీ దివ్యమూర్తి
కని భజింతురు వరభక్త జనులకనుల
విందవైతివి నీవు గోవిందరాజ!

స్తుతి పాత్రంబగు శిల్ప కల్పనములన్
శోభిల్లు నీ గోపురో
న్నతి సౌభాగ్యము, నీదు దేవళపు
విన్యాణంపు చెల్వమ్ము, అ
ద్భుత మౌనీపవశింపు సొంపు తులకింపుల్
నింపగా వెల్గుచున్
కుతుకమ్మున్ కలిగించె నీ విభవమో
గోవిందరాజ ప్రభూ! "

ఈ విధముగ యతిపతి ఆ
దైవతమూర్తులను నేత్ర తర్పణముగ సం
సేవించి మఠమునకు సు
శ్రీవిధి వేంచేయుచుండె చిత్తముపొంగన్

పుడమి పులకింపగా శ్రీ
ఉడయవరులు వెడలు వీధి నోసరిలి జనం
బడుగడుగున కేల్మోడ్పు
ముడుపులు చెల్లింత్రు భక్తి పొంపిరి పోవన్

మునిరామానుజులు సుధా
ఘనోక్తి దివ్యప్రబంధ కాలక్షేపం
బొనరించుచునున్ కతిపయ
దినములు నివసించె దిగువ తిరుపతిలోనన్

నమ్మాళువారు సంధానించు తిరువాయి
మొళిమహోర్థంబులు పోహళించి
తిరుమంగ యాళ్వారు తెలిపినట్టి పెరియ
తిరుమొళి విషయముల్ పరిగణించి
పెరియాళువారు చెప్పిన సరాళపు తిరు
ప్పల్లాండు విభవమ్ము వరిధవించి
ఆండాళు తల్లి సమాలపించిన తిరు
ప్పావు మాధుర్యము ప్రస్తవించి

ఇతరులైన అళ్వార్ల సాయించినట్టి
అతులదివ్య ప్రబంధము లవధరించి
యతికులేంద్రుడు రామానుజార్యమౌళి
ప్రవచనముసేయు పరమ భాగవతగోష్ఠి

ద్రావిడ వేదవాఙ్మయ సుధాసిధి
పేరినవెన్న, మోక్షపుం
జేవవరించు భక్తులకు
చెంగటి తంగెటిజున్ను, సూరిసం
భావిత సూక్తి ముక్తభగ
వద్విషయార్థము లక్ష్మణార్యులున్
కోవిదగోష్ఠి' భాగవత
గోష్ఠిని భాషణసేయు నిత్యమున్
ఆగురువర్యుండట ద్రవి
డాగమగత మహిత పరహితార్థంబులవా
చాగంభీరత దెలుపుచు
భాగవతోత్తముల గోష్ఠి వర్తిలు చుండన్

సందు మనసున్న తుంబియార్ కొండిమనెడు
గొల్లవెలది ప్రతిదినము కొల్లలుగను
పాలు, పెరుగమ్ముచును జీవనముగడపు
వేళలందును, పెద్దలను సేవించుచుండు

తిరుపతి పురమున నిరతము
పెరుగును, పాలును, నవకపు వెన్నయు వేడ్కన్
సరసమగు వెలకు నమ్ముచు
తిరుగును ఆ గొల్లపడతి తేకువతోడన్

ఈ మాడ్కి గోపభామిని
నేమమ్మున చల్లలమ్మి నెగడుచునుండన్
రామానుజ మునిపుంగవు
ధీమహితోక్తులను ఒక్కదినమున వినియెన్

భాగవతోత్తమపదసే
వాగరిమ నితాంత పుణ్య ఫలదంబనుచున్
ఆ గోపవనిత నిత్యము
బాగుగ నర్పించు పెరుగు, పాలున్, నేయున్

చిక్కనగుపాలు, మీగడ, జిడ్డుగలుగు
పెరుగు, వెన్నయు ఆ గొల్ల వెలదిమిన్న
భక్తిదక్షకొత్త భాగవతోత్తములకు
నిత్య మర్పించు మోదము నెక్కొనంగ

పాలు, పెరు గొనగుట భక్తి పాలు పెరుగ
మిసిమి నొసగుట పుట్టువు మిసిమియెనగ
భాగవత సమారాధన ప్రాప్తి కతన
గొల్లయిల్లాలు పున్నెమ్ము కొల్లగొనియె

ఈ విధమున గోపాంగన
భావుకతన్ పరమభాగవత బృందమ్మున్
సేవించుచు, రామానుజ
పావన వాగమృత పూరపానము సేయున్

భాసురములైన యతిపతి
శ్రీసూక్తుల నాలకించి వ్రేవెలది, మదిన్
వాసించె భక్తి భావన
దూసిన తెమ్మెరల విరులతొగ తావివలెన్

ప్రతిదినము గొల్ల పడతుక
యతిరాజు వచించు పారమార్థిక బోధల్
శ్రుతి పేయముగా వినుచున్
మతి మోక్షేచ్ఛా మహాసమాదృతి నొందెన్

పూజ్యయతిరాజు దివ్య ప్రబోధ కతన
తెరలి గోపవనిత గుండె పొరలలోన
బీజముగ, సౌజముగను, అవ్యాజముగను
నాటుకొన్న మోక్షేచ్ఛ ఈనాడు అంకు
రించి, చిగురించి, పూచి, పరిమళించె

ఒకనాడు భాష్యకారులు
పకికటిత వాత్సల్యరేఖ భాసిల్లగ గో
పికతో నిట్లనిమెను ఓ
పికతో మృదు మధుర వాక్య విన్యాసముగన్

"నీ నయవినయమ్ములు మఱి
నీ నిర్మల భక్తిభావనిష్ఠా గరిమల్
మానసమున కెంతేనియు
ఆనందము గూర్చెనమ్మ! ఆ ధీరసతీ!

నీ మదిలోగల కోరిక
ఏమో మెఱిగించితేని యేమఱకను నీ
కామితమును దీర్చెద నీ
కేమాత్రము వలదు సంశయింపగ తల్లి!

అనుటయు శ్రీ రామానుజ
మునిమౌళికి భక్తి వినయములతో గోపాం
గన మ్రొక్కుచు తద్గురువరు
వినుతించెను విహితవాక్య విన్యాసమునన్.

"శ్రీరామానుజ! కేశవార్యతనయా!
శేషాంశ సంభూత! స
ద్వాసోద్ధారక! కష్టవారక! లసత్
సౌలభ్య సౌశీల్య సం
భారా! భారతదేశ పూజ్యచరితా!
మాన్యాగ్రణీ! దీనమం
దారా! సూరిచకోర కార్తికిక
చంద్రా! భాష్యకార ప్రభూ

యతిరాజా! మార్తాండ
ప్రతితేజా! చేతనోద్ధరణ కార్యసమా
దృతనైజా! శ్రితజనదై
వతభూజా! మీ పదములు భావింతు మదిన్

భవ్యమార్గ విహీన పాషండ విమత
పర్వతఖండనోద్దండ వజ్రదండ!
దుర్వార చార్వాక దుర్గర్వగహన
దహన మహోభీల దావాగ్నికీల!
శుద్ధ భావవిరుద్ధ బౌద్ధ మతధ్వాంత
సందోహవారణ చండకిరణ!
పండితమ్మన్య వితండ వాదస్ఫార
భూరుహచ్ఛేద కుఠారధార!

సంగతాజ్ఞాన జైన భుజంగగర్వ
భంగచణవిహంగాధీశ! మంగళాంగ!
సరసదరహాస! శ్రీ రంగపురనివాస!
రవి సదృశతేజ! శ్రీ యతిరాజరాజ!

కరుణాభరణా! తతసం
సరణాంబుధి తరణ! కలుష చయసంహరణా!
తరుణాంబుజ నిభములు మీ
చరణంబులు మాకు దిక్కు జయ యతిరాజా!

నవరాజీవదళో పమానములు,
వందారువ్రజాలోకసం
తృప సంధాయకముల్, పవిత్రములు,
శిష్యస్తోమ సంసేవ్యముల్,
భవపాథో      తారకమ్ములును,
శుంభద్దివ్య భవ్యాంకముల్
భవదీయాంఘ్రులు నాకు దిక్కు
మృదుభావా! లక్ష్మణార్యాగ్రణీ!

వెడగు సంసారపుమడుగు నకించు
మీ యడుగులు కన్నుల కద్దుకొందు
గోము చూపించుచు సోమునిబోలు
మీ మోము సొంపును మనంబున స్మరింతు
చలువలూరించుచు చెలువారు మీకావి
వలువవన్నెకు నమస్సులు పొనర్తు
వేండ్రమ్ము మాపగా తీండ్రించు మీయూర్ధ్వ
పుండ్ర సౌభాగ్యవిస్ఫూర్తి దలతు

కెంజిగురు మోవిపై తులకించు మీదు
మొలకనవ్వులు తలపుగో నిలుపుకొందు
మీ స్వరూపము సేవింతు మేలిబత్తి
భాగవత చిత్తచోర! శ్రీ భాష్యకార!

మీ కైంకర్యము మాకు జీవనము,
స్వామీ! మీ కృపాలోకన
ప్రాకట్యమ్మే సదాశ్రితావనము,
దేవా! మీదునామసంస్మృతి
ప్రాకామ్యమ్మే నితాంతపావనమునై
భాసిల్లు రామానుజా
ర్యా! కల్యాణ గుణాంబురాశి!
యతిరాజా! చేతనోద్ధారకా!

మాయకులోనుగా బ్రతుకు
మానవకోటినీ ఉద్ధరించి, ని
శ్రేయసమౌ పదంబునకు
జేర్చగ దీక్షవహించిమించుగా
వేయిముఖాలతో విమల
విష్ణు మతంబును వజ్రలేపన
ప్రాయముగా, అజేయముగ
వ్యాప్తి నొనర్చిన దేశికాగ్రణీ!

ఉడయవరులు మమ్ము ఒడయడై పాలించు
భాష్యకారు లొసగు పరమపదము
ఎల్లశ్రితుల మేరు వెంబరుమానారు
లక్ష్మణాద్యులు భయలక్షణుల్లడు

కారుణి కాగ్రగణ్య! కం
కల్మష దీనశరణ్య! ఘోరసం
సారపయోధిలో మునిగి
చాంతపించి, కృశించి, క్రుంగితిన్
నారకవహ్ని కీలములు
నన్ను దహించకయుండ మోక్షల
క్ష్మీ రచితానుభూతి కలిమిన్
కలిగించుము దాసురాలికిన్

ఏమని విన్నవింతును యతీశ!
దయానిధి! భాష్యకార! పల్
బాములు పాములైవివవృ
వాసనలన్ విరజిమ్ముచుండె, జ్ఞా
నామృత దానసీరదము
నౌచు ననున్ కరుణించి, నత్యని
త్యామితసౌఖ్యదాయక
పదాప్తిని నాకు ననుగ్రహింపవే!

మీ గాథలు మీబోధలు,
ఆ గమనస్ఫూర్తి నాకు నైహిక-భోగా
భోగత్యాగము, మోక్ష
శ్రీ గతిపయి రాగము మది చిగురించె ప్రభూ!

లీలానిత్య విభూతిదాయకులు
మీరేయంచు భావించియున్
వాలాయంబుగ మీ పదాబ్జయుగళిన్
ప్రాపించితిన్ గొల్లయి
ల్లాలిన్ సుంతయు తెల్వి లేని యొక
మూఢాత్మన్ భవత్ సత్కృపా
శ్రీలాభంబు ఘటించి మోక్షపదవీ
ప్రీతిన్ ప్రసాదింపుమా! „

భక్తియున్, ప్రపత్తి, పరమపదాకాంక్ష
యుమ్మరింప, వినయ మిమ్ముకొనగ
విన్నవించు గొల్లపెలది ప్రపత్తికి
భాష్యకారులెంతొ ప్రమదమందె

భవవి పన్నురాల్, తనకు ప్రపన్నురాలు
విన్నపమ్ము సేయుట సుప్రసన్నులగుచు
భాష్యకారు లనుగ్రహ భాషణమున
పలకె నీరీతి ఆ గొల్లపడతితోడ

"ఏపూర్వ పుణ్యఫలమో
గోపాంగన! మోక్షమందు కోరిక గలిగెన్
రూపించెను నీభక్తిని
ఏపారగ నీదువాంఛ ఈడేరు సుమీ!

పాలవంటి మేలిశీలమ్ము. కమ్మని
మీగడ నుపమించు మేలిమాట,
వెన్నవంటి మనసు చెన్నారు నినుగని
మోదమయ్యె గొల్ల ముద్దరాల!

భగవద్భాగవతార్చ నాభిరుచి,
తద్వాంఛా ప్రవాహ స్రవత్
నిగమ స్వాదుమరంద పానరుచియున్,
నిష్ఠా గరిష్ఠత్వ భ
క్తి గుణోత్పన్న పవిత్రవర్తనము
నుద్దీపింప ముంగొంగు పై
డి గదా మోక్షపులబ్ది? గోపకుల
వాటీ ముగ్ధ పుష్పాకృతీ!

ఎలమి ఘటిల్లె గోపసుదతీ!
తిరమైన ముముక్ష నీమదిన్
కలుగుట మోక్షమిచ్చు అధి
కారము వేంకటశైల భర్తకున్
కలదు సుమీ! యథార్థముగ
కావున నీ విపుడేగి వేంకటా
చలమున శ్రీనివాస పద
సన్నిధిలోన ప్రపత్తి సేయుమా!

అక్షయమైన కాంతినిధియై
వెలుగొందుచు మర్త్యలోక క
ల్పక్షితి జాతమౌచును
విపన్నుల, నాశ్రితులన్, ముముక్షులన్
రక్షణచేసి, కోరిన
వరంబు లొసంగగ, మోక్షమీయగా
దీక్ష వహించు వేంకటపతిన్
భజియింపుము శ్రేయ మబ్బెడిన్

వేంకటనాథుడు కరుణా
లంకారుడు, నిరత నిష్కళంకమ్మగుచున్
పొంకమ్మగు నీభక్తియె
ఊంకువగా గొనుము మోక్ష మో వ్రిజవనితా!

అరమరలేని భక్తి దయి
వారనతించెడు నీ కవశ్యమున్
వరమవదం బొసంగుమని
వ్రత మొకండును వ్రాసియిత్తు, శ్రీ
హరిపద యుగ్మకమ్ము కడ
అర్పణసేయుము దాసురాల! ఆ
వరదుడు నీదుకోరికను
వారకదీర్చు నటంచు పల్కగన్

ప్రాంతమందు నితాంతవార్షల్యధార
గడలుకొనగ కృపాకరు లుదయవరులు
పలికిరంతనె నిలువెల్ల పులకరించె
పొంగె నాభీరసతి యంతరంగంగ

భక్తి సంపన్నురాలగు వ్రజవనితకు
శ్రేయముగ మోక్షమును కృపసేయుమనుచు
భాష్యకార దెశికమణి పత్రమొకటి
వ్రాసియిచ్చెను వేంకటేశ్వరుని పేర

"శ్రీ వేంకటాచలాధీ
శా! వాసవముఖ్య దేవతార్చితచరణా!
శ్రీ వల్లభ! గుణవైభవ!
నా విన్నప మాలకింపు నతజనభరణా!

కల్లకపటము లెఱుగని గొల్లపడతి
భక్తురాలు, సంసార విరక్తురాలు
పరమ పదకాంక్షతోడ ఈ పత్రిముగొని
వచ్చె మీ సన్నిధికి చూపవలయు కరుణ

నీ మహిమ భజించుచు నీ
నామమ్ము సర్మించుచును అనారతమును నీ
న్నేమది నమ్మిన గోపిక
కామితముమ దీర్చవలయు కరుణావార్ధీ!

అనివార్యసి లేఖ గోపాం
గన కిచ్చిన నామె భాష్యకారగురులకున్
వినయమున మ్రొక్కి పత్రము
గొని వేగమెచెరె నేడుకొండల పయికిన్

ఉడయవరులు కూరిమిమీర నొసగినట్టి
పత్రమును దివ్యసందేశ భాషితమును
వేంకటేశు సన్నిధి సమర్పించి, భక్తి
వెలయ గోపభామిని విన్నవించె నిట్లు

"స్వామీ! వేంకటశైలనాథ! కరుణా
పారీణ! వాణీశస్తు
త్రామాది త్రిదశార్చితా వరద!
శ్రీ రామానుజార్యప్రసా
దామోదాంకిత పత్రమున్ గొని త్వదీ
యాభ్యర్థమున్ జేరి నీ
నామ ధ్యానమె ప్రాణమై నిలచితిన్
నన్నున్ కటాక్షింపవే!

భక్తజనులకు ఆనంద భాగ్యమొసగు
తరతరమ్ముల నిక్షేప ధనమునీవు
యుగయుగముల అక్షయ కళాజ్యోతివీవు
వేంకటేశ్వర! వైభవోపేత నిలయ!

స్థిరమతి విశ్వదేశికులు
శ్రీయతిరాజు లొసంగు వ్రతమున్
పరమకృపా సుధార్ద్రి
కలనా పరిపరిపూర్ణ కటాక్షవీక్షతో
నరసి, ముముక్షతా కలితనై
చనుదెంచిన దాసురాలికిన్
పరమ పదం బొనంగవలె
ప్రాభవబంధుర! వేంకటేశ్వరా||

ఈవిధము గొల్లపడతి ప్రార్థించినంత
శ్రీనివాసుడు యతిపతి స్నిగ్ధవినయ
పురుషకార మామోదించి మోక్షమీయ
నెంచె కరుణాసుధామృదు హృదయుడగుచు

ఏడు కొండలవాడు, ఈరేడు జగము
లేలువాడైన శ్రీ వేంకటేశ్వరుండు
భక్తవరదుండు, ఆశ్రిత వత్సలుండు
పరమ పదమిచ్చె ఆ గోపవనితకంత

పరమ పదమందు భాసుర
పరమ మణీమంటపమున ఫణిపతిశయ్యన్
వరలు హరిని సేవించుచు
పరమానందాబ్ధి గోపభామిని మునిగెన్

భక్తురాలు గోవసతికి పరమపదము
వేంకటేశునిచేత నిప్పించి మిగుల
పురుషకారం బొనర్చిన పుణ్యమూర్తి
ఊడయవరుల దయాగుణ మ్ముగ్గడింతు

ధీ చాతుర్య కళావికాసము
సముద్దీపింప పీయూషస
ధ్రీ చీనంబగు వాగ్విధాన కలనన్
శ్రీ భాష్యకారార్యులో
కాచార్యప్రకట ప్రబోధిత విశి
ష్టాద్వైత సిద్ధాంతసా
మీ చీన్యంబు సమస్త విశ్వజన
సామీప్యస్థితిన్ గాంచుతన్

రామానుజార్య దివ్యా
జ్ఞా మహిమము సర్వకాల, సర్వదిశల ను
ద్దామ పరాక్రమ కలితం
బై మహి వర్ధిల్లుగాత! భాసురమగుచున్



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ రామానుజ తాతావళి

శ్రీ పెరుమ్బూత పురీమహోదయ! దయా
సింధూ! జగద్బాంధవా!
శ్రీ మత్కాంతిమతీ ప్రియసుతా!
శేషాంశ సంభూత! మా
యామేయాంధతమః ప్రభాకర!
అజేయక్షోణి సంచార! నీ
నామం చెప్పుడు మాకు జీవన
మనంత పరిజ్ఞ! రామానుజా!

కుందస్మేర ముఖారవింద విలసత్
గోవిందసిద్ధ్యాను ని
ష్పందజ్ఞాన నిధాను, మౌని తిలకున్
వందారు మందారు అ
శ్వందారున్ స్మరియించి తత్ శుభ
మనోవాంఛా ప్రకారంబు పెం
పొందన్ భాష్యము నంతరించితివి
భావోదార! రామానుజా!

వ్యాస ప్రోక్తము! బ్రహ్మ సూత్రములకున్
భాష్యంబు, గీతార్థ వి
న్యాసంబున్ వెలయించు భాష్యముమ
న్యంథానించి, లోకోపకా
రాసక్తిన్ ప్రకటించి సర్వజన
సేవ్యంబైన సౌభాగ్యమున్
వాసింపన్ విలసిల్లినావు కరుణా
పారీణ! రామానుజా!

దేవాధీశ కిరీట రత్నఘృణిమత్
శ్రీ రంగపాదద్వయీ
సేవాతత్పర! శేముషీచతుర!
కాశ్మీరస్థ శ్రీ శారదా
దేవీ ప్రాపిత భాష్యకార బిరుదా!
దివ్య ప్రబంధ క్రియా
ప్రావీణ్య ప్రవణా! భవన్మహి నే
వర్ణింతు రామానుజా!

జిలుగుంబంగరు రంగులన్ గులుకుచున్
చెన్నారు నెమ్మేను, మం
జుల మందస్మిత కుందకుట్మల రుచుల్
సొంపారు కెమ్మోవి, క్రొం
దెలినిగ్గుల్ గొను ఊర్ధ్వ పుండ్రములు
సుద్దీపించు నెమ్మోమునున్
గల నీభాసురమూర్తి సేవ్యము
జగత్కల్యాణ! రామానుజా!

అతిభవ్యంబు భవత్పదాంక నికరం
బాసేతు శీతాద్రిభా
రతభూమిన్ తులకించె, నీ మధుర
ధారాధీర శ్రీ సూక్తిసం
తతి వేదాంతవచః ప్రపంచమును
నుద్ఘాటించి భాసించె నా
శ్రిత వాత్సల్య పయోధి! చేతనగణ
శ్రేయస్క! రామానుజా!

యతిలోకాగ్రణి! కేశవాత్మతనయా!
అవ్యాహతాజ్ఞానము
న్నత! పరిజ్ఞాన నిధాన! నాస్తిక మతో
న్మాదాది భేదక్రియా
శతకోటీ! కృతఘాటి! పాటిత
తమస్సందోహ! విద్వజ్జగ
న్నుత వేదాంత కలాప! భాగవత బంధూ!
స్వామి! రామానుజా!

శ్రీ రంగేశ పదారవిందయుగళీ
చింతా మధూళీతృషా
సారంగాయిత మానసా! సకల
శాస్త్రజ్ఞాన సంపూర్ణతా
పారంగత్వ విశిష్ట ధీవిభవ!
దీవ్యద్భవ్య సౌశీల్యభూ
షారంగత్ శుభజీవనా! యతిపతీ!
సద్భావ రామానుజా!

నిను సేవించెద, నిన్ భజించెదను
నిన్నే యెత్తు పూజించెదన్,
నిను భావించెద, నీ కృపాగుణము
వర్ణింతున్ సదాశేషభూ
జన సంభావన భావనా! గురువరా!
సంసార నిర్మగ్నచే
తన లోకోద్ధరణ ప్రవీణ! భవభిత్
పారీణ! రామానుజా!

పాషండ ద్రుమషండ దావదహనా!
పాపాగ్ని వర్షోదయా!
దోష ధ్వాంతని వారణా రుణఘృణీ!
దుర్వార సంసారరుక్
భైష జ్యోక్తి నిధీ! సుధీనుత
వచః ప్రాగల్భ్య సంపన్నతా
శేషా! సద్గుణ భూష! సుందర!
దరస్మేరాస్య! రామానుజా!

దేవా! విశ్వనుత ప్రభావ! విలసత్
ధీవైభవోపేత! మ
ద్భావశ్రేణి నితాంత భక్తి రస
శుంభత్ పూర్ణ కుంభంబుగా
కావేరీ విమలాంబుధారలయి
ప్రక్షాళించు మీ పాదరా
జీవంబుల్ యతిరాజ! సద్గుణగణ
శ్రీ ధామ! రామానుజా!

అలఘిల్లీశుని రాణివాసమున
ప్రేమారాధనల్ గొంచు సొం
పిలు రామప్రియయు దెచ్చి వైభవముగా
మేల్కోటలోనన్ పురా
కలిత ప్రాభవరీతి నిల్పుచు జగత్
ఖ్యాతిన్ సమార్జించు నీ
యలఘు ప్రజ్ఞను సన్నుతించుటకు
శక్యంబౌనె? రామానుజా!

నీ దివ్యోక్తి తతుల్ సుధారస
స్రవంతీ ధారలై చేరఁన్
వేదాంతార్థము పంతరించినవి
తత్పీయూ షధారారసా
స్వాదా సక్తులు నిత్య ముక్తులగుచున్
వైకుంఠ ప్రేమాదరా
మోద ప్రాప్తికి యోగ్యులౌదురు
గుణాంభోరాశి! రామానుజా!

గురునాదేశము త్రోసిరాజని జనుల్
కొండాడగా దేవమం
దిరవుంబో న్నత గోపురంబు పయినన్
నిల్చుండి గొంతెత్తి "ఓ
జనులారా" అని పిల్చి మోక్షపద
సంధానంబు గావించు శ్రీ
తిరు మంత్రింబును చాటినావు
కరుణాబ్ధీ! స్వామి! రామానుజా!

పదతీర్థంబు నొసంగి రాజసుత
దృష్ట్రద్ధృహ్మ రక్షస్సు నా
పద బాపంగల పుణ్యమూర్తి వి భవత్
వాల్లభ్య సౌలభ్య సం
పద సొంపున్ వినుతింపగా వశమె?
దేవా! లక్ష్మణార్యా! పరం
పద సంపాదన కీవెకారణము
భవ్యస్వాంత! రామానుజా!

శయనం, బాసన పాదపీఠములుగా
ఛత్రంబుగా, పాదుకా
ద్వయిగా, సుందర మందిరంబుగ
సదా తాత్పర్య సంయుక్తిన
వ్యయనిష్ఠన్ సిరివల్లభున్ గొలుచు
నీవా శౌరియాజ్ఞన్ మహో
దయ మందన్ విలసిల్లె చేతనజనో
ద్ధారంబు రామానుజా!

వరభా స్వత్తరుణారుణాంశుక రుచుల్
భవ్య త్రిదండోల్లి నత్
కరపద్మంబును, ఊర్ధ్వ పుండ్రములు
నుద్భాసించు స్నిగ్ధాంగముల్
కరుణా పూరిత లోచనాబ్జములు
కల్గన్ వెల్గు నీదివ్యబం
ధురతేజో మయమూర్తికిన్ నతుల
పూదోసిళ్ళు రామానుజా!

నిష్ఠాధిష్ఠిత చిత్తవృత్తియలరస్
నిర్వృత్తి సంపన్న స
ద్గోష్ఠీ పూర్ణుల మంత్ర వర్ణకలనా
గుంజన్ము ఖాంభోజు శ్రీ
గోష్ఠీ పూర్ణబుధేంద్రు పావన తరాంఘ్రుల్
భక్తితో గొల్చుచున్
శ్రేష్ఠంబౌ తిరుమంత్ర రత్నము నొగిన్
చేకొంటి రామానుజా!

శ్రీ మద్గాంగజలంబు. వహ్ని, తులసీ
శ్రీ పత్రమున్ మించి యెం
తే మాన్యత్వ పవిత్రతా గరిమమున్
నూల్కొల్పగా జాలుమీ
నామంబున్ స్మరియించు మాత్రమున
నానా దోషముల్ దూరమౌ
మీ మాహాత్మ్యము సన్నుతింతు కరుణా
మేయాత్మ! రామానుజా!

భవవారాన్నిధి తారకంబు, బుధ
సంభావ్యంబు, ముక్తిప్రద
వ్యవహార ప్రచురాత్మకంబగు
విశిష్టాద్వైత సిద్ధాంతమై
భవమున్ వేయిముఖాలుగా జగతితో
వ్యాపింపంగా జేయు మీ
యవతారార్థము సార్థకంబగుచు
స్తుత్యంబయ్యె రామానుజా!

నీ పాదాబ్జ పరాగరేణువులు
మాణిక్యాలుగా మాకుని
క్షేపంబై విలసిల్లె, తద్ధనము
ప్రక్షేపించినన్ జీవన
వ్యాపారంబు విశేష మోక్షపద
లాభస్ఫూర్తి గావించి సు
శ్రీ పత్న్యాప్త గురుత్వ నోయతివరా!
చిద్రూప! రామానుజా!

నీ సౌశీల్య వివేక వాగ్విభముల్
నిత్య ప్రశంసార్హముల్
నీ సౌభాగ్య విశేషతత్త్వము సదా
నిష్ఠాగరిష్ఠాప్తమున్
నీ సౌభ్యాగవిశాలధీ గరిమముల్
నిర్వాణ సంధాయకం
బై సొంపిల్లె సతంబు లక్ష్మణయతీంద్రా!
స్వామి! రామానుజా!

తరుణీ కోమల నేత్ర మోహితు
ధనుర్దాసున్ కటాక్షించి, సుం
దర రంగేశుని కన్నుదమ్ములను
సందర్శింపగా జేసి, శ్రీ
హరికిన్ దాసునిగా నొనర్చితివి
నీ యవ్యాజకారుణ్యమా
ధిరికిన్ లోకము నైకరీతులు గ
నిన్ స్తోత్రించె రామానుజా!

భవవారాశి తరించి నిత్యసుఖ
సంవద్యోగ వైరాగ్యలా
భవిపంచిన్ పలికించి, మోక్షపదవిన్
ప్రాపింప భక్తిప్రప
త్తి విశేషంబులె సాధనంబులనుచున్
దివ్యోక్తి సాయించి మా
నవలోకంబును ఉద్ధరించితివి
ఆనందాత్మ! రామానుజా!

శ్రీ కూర్మంబును, అంజనాచలమునున్
సింహాద్రియున్, ధన్యతో
త్సేకంబౌ కరిశైలమున్ బదరియున్,
శేషాచలం బాదిగా
నైక క్షేత్రములందు వైష్ణవకళా
న్యాసంబు గావించు అ
స్తోకంబైన భవత్ప్రభావమునకున్
జోహారు రామానుజా!

స్వామీ! లక్ష్మణయోగివర్య! సకలా
శాదేశ కాలంబులన్
స్థేమంబై, నుతనామమౌ మను భవత్
దివ్యాజ్ఞ శశ్వత్ జన
స్తోమక్షేమ కరంబుగా, ఘనముగా
శోభిల్ల వర్ధిల్లుతన్!
భూమానంద పద ప్రదాన చతురా!
ప్రోద్ధాత్మ! రామానుజా!

శ్రీ రామానుజ కీర్తి కౌముది కళా
స్నిగ్ధాం తరంగంబు, ఆ
ళ్వారాదుల్ వెలయించినట్టి ద్రవిడ
ప్రాబంధి కార్థంబులన్
సారస్యంబును, భక్తి మేల్మిని విశి
ష్టాద్వైత వేదాంత సం
భారంబున్ వరదాప్త మై కనియె
శశ్వత్కీర్తి రామానుజా!

# వేముగంటి కృతులు

## ముద్రితములు

1 ప్రబోధము
2 అమరజీవి బాపూజి
3 కవితాంజలి
4 నవమాలిక
5 తిక్కన
6 వీరపూజ
7 మణి కింకిణి
8 జీవన స్వరాలు
9 వేంకటేశ్వర వినుతి
10 వేంకటేశ్వరోదాహరణము
11 తెలుగు బాలశతి
12 శ్రీ గోపాలకృష్ణ సుప్రభాతమ్ (సంస్కృతము)
13 ఆంధ్ర విష్ణువు
14 కవితా కాహళి
15 స్తుతి రత్నావళి
16 మంజీరనాదాలు
17 బాలగేయాలు
18 కవితా సిందూరం
19 గణేశోదాహరణము
20 కాంతి వైజయంతి

21 వివేక విజయము

22 వ్యాస కలాపము (వ్యాస సంపుటి)

23 శ్రీ వానర సరస్వతి వైభవము

24 అక్షర దీపాలు

25 భక్త రామదాసు

## అముద్రితములు

1 ప్రియదర్శి

2 భావ తరంగిణి

3 అన్నమయ్య కవితా వైభవము (విమర్శ)

4 రామో విగ్రహవాన్ ధర్మః (విమర్శ)

5 వేముగంటి మాట



